సంపుటము 4] అక్టోబరు 1917 [సంచిక 4

# బాలమిత్ర



## సూర్యుడు, నీడ గడియారము, గడియారముచేయు బోధలు

కాలమనునది చాల ఆశ్చర్యమైనది. అప్పుడప్పుడు చాల త్వరగా పోవును. అప్పుడప్పుడు నిమిషములును గంటలును యెంత మందముగా పోవును! పిల్లలాడు సమయమున గంటలకు రెక్కలున్నట్లు శీఘ్రముగా ఈ నిమిషము లెగిరిపోవును గాని ఆ బిడ్డలే బడియందుఁ గూర్చుండి పుస్తకములనుఁ జదువుచున్నప్పుడుగాని, పలకలమీద వ్రాయు

చున్నపుడుగాని బహుదూరమునుండి వచ్చినందున ఆయా
సము జెందిన యొక ప్రయాణస్థునివలె నవి మెల్లగా దాటి
పోవును. ఆట విడుపు గడియలెంతో మందముగా వచ్చును.
నాలుగుగంటలకుఁగాని, నాలుగున్నరకుగాని ఉపాధ్యాయుడు
సెలవిచ్చినతరువాత ఆరుగంటలవరకు నుండుసమయము
యెంత త్వరగా తాము గడుపగలరో బాలురకు మిగుల
విచిత్రమైన విషయము.

కాలము తెలిసికొనుటకు మూడు మార్గము లున్నవి.
1. సూర్యునివలన చూచుకొనవచ్చును. 2. నీడ గడియారముఁ
జూచి యెన్నిగంటలయినదో తెలిసికొనఁవచ్చును. 3. గడి
యారమువలన గూడ చెప్పగలము. వీనిలో నొక్కొక్క
టినిగూర్చి ఆలోచించి దానివలని పాఠములు నేర్చుకొందము.

1. సూర్యుడు.—పిల్లలతోటిఁ నెల్లకాలము ఒక మాటను
జెప్పటకు ప్రయత్నించుచున్నాడు. అది యేమనిన “పైకి
చూడవలెను”నియే. ప్రొద్దున నీవు లేచినపుడు సూర్యుడు నీ
కిటికిద్వారా నీ యింటిలోనికిఁ జూచి “ఇంత కాంతియు
సంతోషమునిడు నా వైపుచూడు. పైకిచూడు మం”టున్నాడు.
మధ్యాహ్నము విస్తారమైన, ఈ మహావెలుగును వేడిని
యెక్కడనుండి వచ్చుచున్నదనినఁ బైకి మరల చూడవలయును.
ప్రొద్దుగ్రుంకితేకూడా మన పరమతండ్రి యెంత సొగసుగా

ఆకాశమంతటికి వివిధరంగులు వేసెనో గుర్తుపట్టుటకు మనము పైకి కన్నులెత్తవలెనని సూర్యుడు పిలుచుచున్నాడు. అలాగే మనమందరము ఎల్లప్పుడు ఆకాశమువైపు అనగా దేవునివైపు చూచుచుండవలెను. ఈ లోకసంబంధమైన సౌఖ్యములకు శరీరాశలకు పాపములకు పెడమొగము పెట్టి పరలోకములో మన కాపురమున్నదని జ్ఞప్తికితెచ్చుకొని యేసును వెంబడించి పైకి చూచుచుఁ వెళ్లవలసియున్నది.

2. నీడ గడియారము.—కొన్ని చోట్లలో మనుష్యులు ఈలాటి గడియారమువలన గంటలనుఁ జెప్పుదురు. ఇది ఒక చిన్న స్తంభము. దానిమీదనున్న బల్లమధ్యను చిన్న యినుపబద్ద యొకటి నిలుపుదురు. ప్రొద్దుదయించి తూర్పునుండి పడమర వరకు ఆకాశమార్గమున వెళ్లుచుండగ, ఈ బద్దయొక్క నీడ ఆ చిన్నబల్లమీద ఆ ప్రకారముగానే కదలును. కదిలితే, క్రమముగా బల్లపైన వ్రాసిన గంటల సంఖ్యలపై నీడపడును. గనుక ఆ సంఖ్యల దగ్గరకువచ్చిన నీడను జూచి గంట యెంతయో తెలిసికొందురు.

సరే, ఈ నీడ గడియారము నేర్పించు పాఠమేది? కొడేకానలను కొండల ప్రదేశమునందు ఈలాటి కంబమొకటున్నది. దానిమీద "నేను యెండగల గంటలుమాత్రమే లెక్కించుదు"నను వాక్యము వ్రాసియున్నది. ఇంగ్లీషు భాషయందు

యెండగల సమయమును దానికి సంతోషకరమైన సమయ
మను భావముకూడ గలదు. గనుక నీడ గడియారము ఆకాశమునకు మబ్బుగా నున్నప్పుడుగాక యెండగా ఉన్నప్పుడు మాత్రము గంటలను చూపించినట్లుగా మనము కాంతిగల సంతోషకరమైన సమయములనుఁ గూర్చి మాత్రమే జ్ఞాపకముఁజేసికొని అట్టి సమయములను గూర్చియే మాటలాడ వలయును.

కొందరెల్లప్పుడు తమ జబ్బులను వివరించి తమ కష్టనష్టముల వైపు చూచి ఇతరులతో వానినిగురించి చెప్పుచున్నారు. ఎక్కడికి వెళ్లినను తమ దుఃఖబాధలను అందరికి చూపి వారికిని దుఃఖము కలుగజేయుచున్నారు. మన మాలాగు చేయక, మనకువచ్చు మేలుమీదనే మనస్సునిలిపి అందరికి సంతోషము కలుగజేయవలెను.

3. చివరగా, గడియారమును చూతము.—మంచి పాఠమునుఁ గావలెనని దానితట్టు చూచిన ప్రతినిమిషము టిక్కు టిక్కు మనుచున్నది. మరియొక మాటలేదు. అయినను యెంత నిలకడగా చెప్పుచున్నదో జూడుడీ! అదెప్పుడును ఖేదపడదు. రేయింబగళ్లు, యెప్పుడు వినినను టిక్కు టిక్కు మనే అంటున్నది. ఒకానొకప్పుడు, గడియారపు ముండ్లు త్వరలో తిరగవలెనని, నెలవు సమయము శీఘ్రముగా

రావ లేనని బడి పిల్లలు ఆతురపడుదురు. అప్పుడప్పుడు ఆలు గడియలు మందముగా జరుగవలయునని వారి ఇష్టముగాని గడియార మన్ని కాలములయందును ఒకటే రీతిగాను నిబ్బర ముగాను నిలకడగాను పోవును. ఇచ్చట మనకు మంచి మాదిరి యొకటున్నది. ఏదనగా:—"నిలకడగా నుండుడి. తొందరపడవద్దు. దేనిగూర్చి చింతించక మీ యనుదిన కృత్య ములను నమ్మకముగా చేయుడి." యనునదే కాగా ఎన్ని తొందరలు శోధనబాధలు వచ్చినను సరే బెదురులేక మనము యేసుక్రీస్తుయందు నిలకడగా నుండవలయును.

సూర్యుని, నీడ గడియారమును, సాధారణ గడియార మును జూచి "పైకి చూడుడి. సంతోషపడుడి. నిలకడగాఁ నుండుడి" యను గొప్ప నీతులను నేర్చుకొందము.

---

## భూషణరాజము



ఒక ఇంగ్లండుదేశపు రాజు తురుష్క స్త్రీని వివాహాము చేసికొనెను. ఆమె మిక్కిలి ధనవంతురాలు. ఆమెకు మంచి వెలగల నగలుండునవి. ఆమె ఇంగ్లండులో నుంటుం

ంగా ఆ దేశము ఆమెకు సరిపడలేదు. క్షయరోగము వచ్చినది. ఆమెను ఆదరించుటకు ఒక దాది కావలసివచ్చెను. ఆ దాది భక్తిగలది. సత్యవేదము ఎల్లప్పుడు చదువుచుండునది. ఆ దాది ఒక గదిలో కూర్చుండి, సత్యవేద భూషణమును పరీక్షించుకొనుచుండేది. దొరసాని దాదిని చూచి నీవు 'ఎప్పుడును గదిలోనే కూర్చుండి యుంటావు. నీకు ఆయాసము లేదా అనెను. దాది లేదనెను. దొరసాని! మన మిద్దరము ఆయాసము తీర్చుకొనుటకు, నా నగలు చూచుదము రా అని చెప్పెను. అందుకు దాది "కీర్తివలన ఆకలితీరదు" అను సామెతను చెప్పెను. దొరసానిగారి నగలన్నిటిని చూచిన తరువాత, దాదిని చూచి నీకు ఏమైనా కావలెనా? అని అడిగెను. అందుకు దాది నాకు ఏమిన్ని అక్కరలేదు. నాకు రత్న, బంగార, వెండి, మణులతోను నిండియున్నటువంటి ఒక నగ ఉన్నది. అందులో ఒకటిని చూపించెదను, అని సత్యవేదము తెరచి, "నాకు కలిగిన దానితో సంతుష్టి కలిగియుండవలెను"నని నేర్పించెను. అంతట దొరసాని మనస్సు త్రిప్పుకొని దాదికి ఈ భూషణము ఏలాగు వచ్చినదో తెలిసికొని, ఆ దినమునుండి సత్యవేదమును చదువుచు దేవుని యందు భక్తిగల దొరసానై యుండెను. ఆలాగుననే యింకొక భూషణమును చూపించెను. "పాపులను రక్షించుటకు, క్రీస్తు

యిన యేసు లోకమునకు వచ్చెనను వాక్యము, నమ్మతగినదియును, పూర్ణాంగీకారమునకు యోగ్యమైనదియై యున్నది." అని నేర్పించెను.

---

# చిన్ని బాలిక ఈవి

తెల్లవారెను కోడికూసెను ♦ కావుకావని కాకులరచెను
అప్పుడేయొక చిన్ని బాలిక ♦ పూలతోటకు వెళ్లిపోయెను
నాలుగైదేండ్లున్న బాలిక ♦ మోమునందము ముద్దుగులుకును
తోటలోపల చక్కగావిడి ♦ పూచియుండిన మల్లెపూవులు
దండగ్రుచ్చెను మల్లెదండను ♦ మెడనుదాలిచి మెల్లగాతన
దారిబోవుచు నాటలాడుచు ♦ పాటపాడుచు వెళ్లుచుండెను
దారిలోనొక చెట్టుక్రిందను ♦ పుట్టుగ్రుడ్డిది పండుముసలిది
జాలిపుట్టెడి మొఱలువెట్టుచు ♦ బిచ్చమిమ్మని యడుగుచుండెను
దానికేమియు నివ్వకుండక ♦ నెవ్వరేనియు బోవజాలరు
అంతముసలిది అంతగ్రుడ్డిది ♦ అంతకనికరముంచదగినది
దానిజూచిన తోడనే మన ♦ చిన్నిబాలిక మనసుకూడను
కరగి నీరయి పోవుచుండెను.

ఏమిరెయెరుగని చిన్నిబాలిక ఏమిటోయని చూచుచుండెను.
"పాపమయ్యో" యనుచు బాలిక ♦ ముసలియొద్దకు బోయినిలిచెను
ఏమియైనను దానికిచ్చుట ♦ తగినపనియని తనకుదోచెను
అట్టులేమరి తోచకుండిన ♦ ఆటలాడుచు నున్న బాలిక
ఆగునాతన దారిబోవక ? ♦ ఆగియుండిన ఉండుగాని

ముసలినిట్టుల పలుకరించునె? ♦ "అవ్వ! ఏమిది మొరలువెట్టుచు
గట్టిగానీ వేడ్చుచుందువు? ♦ ఏమిచేయుదు? కానిదైనను
లేదుగానా యొద్దనిప్పుడు ♦ పోనిలేగో ముసలిదానా!
రేపునీకొక కానియిచ్చెద ♦ నూరకుండుము గ్రుడ్డిదానా
కావలయునెడ తీసికొమ్మా ♦ పూలదండను చక్కగానిడి
నట్టిమల్లెలు కోసి గ్రుచ్చితి ♦ తీసికో" యని ఇచ్చివేసెను.
అపుడుముసలిది చిన్నిబాలిక ♦ ప్రేమతోతన చేతికిచ్చిన
పూలదండను సంతసించుచు ♦ కొప్పుజుట్టెను "కన్నతల్లీ
చాలకాలము ♦ నీవుబ్రతుకుము ♦ దేవుడెప్పుడు నిన్నుగాచును
ఎంతచల్లని దానవమ్మా ♦ ఎంతచల్లని దానవూ" యని
గ్రుడ్డిముసలిది చిన్నిబాలను ♦ దీవనల్ దీవించి పంపెను.

---

# తన చిలుకయే తనకు సాక్షి

ఒక మనుష్యుడు ఒక చిలుకను మిగుల మక్కువతో పెంచుచుండెను. ఆ చిలుకయు తన పోషకునియెడల ప్రీతిగలిగి యుండెను. ఒక దినము ఒకడు ఆ చిలుకను దొంగిలించుకొని పోయెను. సొంతగాడు తన చిలుకను గానక వ్యసనముతో ఊరంతయు వెదకెను. తుదకు తన ముద్దు చిలుక ఒకనియొద్దనుండుట చూచెను. చూడగానే, నా చిలుకను నాకు ఇమ్ముఅని వానిని అడిగెను. దొంగలించినవాడు, నేను దానిని ఇయ్యను అది నాది. నేను దానిని చాలకాలము



నుండి పెంచుచున్నాననెను. సొంతగాడు, ఆ మాటలు విని తన తగవును ఆ యూరి న్యాయాధిపతితో విన్నవించుకొనెను. ఆ న్యాయాధిపతి, వాది ప్రతివాదుల నిద్దరను రావించి విచారించెను. అప్పుడు ప్రతివాది, వాదినిచూచి, అది నీచిలుక అనుటకు సాక్షియెవరు? అని అడిగెను. అందులకు వాది, నా చిలుకయే నాకు సాక్షియని బదులుచెప్పెను. వెంటనే న్యాయాధిపతి ఆ చిలుకను న్యాయసభకు తెచ్చునట్లు ఉత్తరవుచేసెను. ప్రతివాది చిలుకను పంజరముతోడ బట్టనుమూసి తెచ్చెను. అంత సొంతగాడు పంజరమునొద్దకేగి, కప్పియున్న బట్టనుతీసి, తన చిలుకనుచూచెను. చిలుకయు తన యేలికనుచూచి, మితిలేని సంతోషముతో నాతని ముద్దుపెట్టుకొనెను. దొంగ దానినిచూచి, చిలుక అందరిని ముద్దుపెట్టుకొనును అనెను. అట్లయిన నీవును ముద్దు

పెట్టుకొనుము, అని న్యాయాధిపతి చెప్పెను. ప్రతివాది ముద్దుపెట్టుకొనుటకై చిలుకదగ్గరకుపోగా అది నెత్తురుకారునట్లు వాని పెదవిని పొడిచెను. దొంగ నొప్పికి తాళలేక తుళ్లిపడెను. దీనినిచూచి జనులు చేతులుతట్టినవ్విరి. న్యాయాధిపతి చిలుకను సొంతగానికి ఇచ్చివేయున ట్లుత్తరవుచేసెను. వాదికి వ్యయమయిన ధనముకూడ ఇప్పించి, ఆ దొంగకు కఠినశిక్ష విధించెను. కాబట్టి మనమును ఈ చిలుకవలెనే, సాతానుయొక్క శోధనలకు లోబడక, యేసురక్షకునినమ్మి ఆయనకు ఇష్టమగు మార్గమున నడుచుకొనవలెను.

---

# ప్రకృతి పాఠములు

38 వ-పాఠము

## కండరములు

(ఆగస్టు సంచిక శేషము)

చేతియందు, వ్రేళ్లనువిప్పి ముడిచెడి కండరములు కొద్దిగానున్నవి. వ్రేళ్లచే చిన్నచిన్న పనులుమాత్రము జరుగును. కష్టమైన పనులను జేయించు పెద్దకండరములు చేతికి పైగా నున్నవి. అవి మిగులపెద్దవి. అట్లు గానియెడల ఏ వస్తువునైనను మనమంత గట్టిగా పట్టుకొననేరము.

మన మన్నిపనులును అరచేతితో చేతుముగదా. అట్లైన యెడల పనులను జేయు కండరములు దూరముగా నుండుటేల? అవి అరచేతిలోనే యుండినయెడల అందము చందములేని తిత్తువలె నుండును. గనుకనే లవి పనిస్థలమునకు దూరముగా నుండి సన్నని దారములవంటి పదార్థములచే వ్రేళ్లను ఏవైపున కైనను త్రిప్పగలుగుచున్నవి. ఆ కండరములు చేతులకుపైగా నుండుటవలననే భుజములకట్టి యందము గలుగుచున్నవి. ఇదేమాదిరి ఏర్పాటును అనేక జంతువులలో జూడవచ్చును. సాధారణముగా కోయబడిన కోడికాలును పట్టుకొని తెల్లని దారమువంటి దానినిలాగి పిల్లలాడుకొనుట మనలో ననేకులకు దెలిసినవిషయమే. కాలి వ్రేళ్లలోని కండరములు, చేతి యందలి కండరములవలె నున్నవి. మణికట్టుపద్దను, చీలమండ యొద్దను స్నాయువులచే గట్టిగా కట్టబడియున్నవి. లేనియెడల అవి వ్రేలాడుచు, ఎప్పుడో ఒకసారి ఊడిపడిపోవును. చేయి గాని కాలుగాని వంగినప్పుడెల్లను అవి గట్టిగా కట్టబడియుండక పోయినయెడల, ముడుతలుపడి సాగును.

కండరము లనేక యాకారములు గలిగియున్నవి. కొన్ని గుండ్రముగను, కొన్ని బల్లపరుపుగను, మరికొన్ని పొడవు గాను, కొన్ని పొట్టిగానుండును. ఆయాకండరములు, వాని వాని పనులకు దగినట్లు ఆకారములు గలిగియున్నవి.

పరిమాణమునందును, వేరుగానున్నవి. కొన్ని చాలపెద్దవి, మరికొన్ని చాలచిన్నవి. కమ్మరిపని చేయువారిదండ లెంత పెద్దవో కనిపెట్టితిరా? పాటలు పాడునప్పుడుగాని, మాట లాడునప్పుడుగాని పనిజేయు కండరము లెంతోచిన్నవి.

ఆకాశమునం దెంతోవడిగా నెగురుపక్షులకు మంచి కండ రములున్నవి. అట్టి కండరము లుండుటవలననే వానికి గుండ్రని బోరలుగలవు. కొన్ని పక్షులుచేయు మధురమైన స్వరమును కలిగించు కండరములు బహు సన్ననివియు, కంటికి కనుపడ కుండునంత చిన్నవియునై యున్నవి.

---

# బైబిలు పిల్లలు

## దావీదు

దావీదు యెష్షై యను వాని కుమారుడు. బెత్లేహేము నివాసి. అతనికి ఏడుగురు అన్నలు గలరు. సౌలు దుర్మార్గుడై రాచరికము సరిగా చేయక యెహోవాకు కోపము రప్పించినప్పుడు ప్రభువు అతనికిమారుగా రాజునుగా నభిషేకించుమని ప్రవక్తయైన సమూయేలుకు ఆజ్ఞాపించెను. దావీదు చిన్నతనములో తల్లిదండ్రుల ఆజ్ఞప్రకారము



గొఱ్ఱెల మందల కాయుచుండువాడు. అట్లు కాయుచు కాలము వ్యర్థము చేయక కిన్నెర వాయించుకొంటూ కొన్ని కొన్ని చిన్న కీర్తనలు పాడుకుంటూ ఉండెడువాడు. ఇట్టి తరుణమున నే ప్రవక్తయగు సమూయేలు బెత్లెహేమునకువచ్చి ప్రభు వేర్పరచుకొనిన చిన్నవాడెవడని విచారించవలసి వచ్చెను. యెష్షయియొక్క ఏడుగురు కుమారుల నొకరితర్వాత నొకని పిలిచి ఎవడు రాజుగా నుండవలెనని వృద్ధుడైన సమూయేలు

ప్రభువు నడిగెను. మనకే సంగతియైన తెలియకున్నప్పుడు ఆలోచన కర్తయగు ప్రభువును సమీపించి యడిగిన ప్రభువు తప్పక తగిన సలహా ననుగ్రహించునని ఈ ప్రవక్త చరిత్రమునుబట్టి నేర్చుకొందము. చివరకు ప్రవక్త ఆ ఏడుగురిలో నెవడు కాడని తెలిసికొని వారి తండ్రిని ఇంకను నీకెవడైన కొమరుడున్నాడా యని యడిగి యొక చిన్నవాడు మంద కాయుచున్నాడని తెలిసికొని వాని పిలువనంపించి యాతనికి అభిషేకము గావించెను. చూచితిరా! బాలమిత్రులారా! దావీదను చిన్నవాడు రాజుగా నియమించబడునని యెవరు అనుకొనకపోయిరి. అతని అన్నలు రూపు సౌందర్యములు గలవారు. గాన వారినే ప్రభువు ఇశ్రాయేలీయులకు రాజుగా నేర్పఱచుకొనునని మోసపోయిరి. ప్రభువు దృష్టికి సౌందర్యము కాదుగాని గుణము ముఖ్యము. అంత అల్పులుగా నెన్నబడినను మన మనుదిన పనులను క్రమముగా చేసికొని ప్రభువు దృష్టికి యోగ్యులముగా ప్రవర్తించిన ప్రభువు గొప్ప గొప్ప పనులకు అల్పులనే ఏర్పరచుకొనును. చిన్న చిన్న పనులని నిర్లక్ష్య పెట్టకుడి. నిన్న పని బాగా చేసితిమి కదా ఈనాడెందుకని సోమరులుగా యుండకుడి. అట్టి వారిని గొప్పపనులకు దేవుడెన్నడు వినియోగించుకొనడు.

(సశేషము)

---

# బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

ప్రియమైన బాలమిత్రను చదువు బాలికా బాలురారా! మా తండ్రి ప్రతి మాసము ఒక బాలమిత్రను తెచ్చి నాకు యిచ్చుచుండెను. నేను దానిని చదివినందున సంతోషముగా ఒక ఉత్తరము బాలమిత్రటపాకు వ్రాయవలయునని నాకు చాలా ఉల్లాసము కలిగెను.

మా బడిలో విద్యనేర్చుకొను మేమందరము ముప్పదిమందిమి. మేము ప్రతిదినము ఉదయము సాయంత్రము ఆత్మీయమైన ఆరా

ఘనలోను బైబిలు పాఠములోను ఆరంభించుచు విద్య నభ్యసించుచున్నాము. ప్రతి సబ్బాతున మేమున్ను యింకా యితర అన్యపిల్లలును కలసి సాయంత్రము 4 ఘంటలకు సబ్బాతు బడికివెళ్లి ఆత్మీయమైన బోధలు మా పంతులుగారి ద్వారా నేర్చుకొందుము. మరియు మమ్మును మంచి కీర్తనలతోను యింకా కొన్ని బైబిలు వాక్యములు నేర్పుటతోను తెలివిలోనికి మర్యాదలోనికి రప్పించుటకు కష్టించియున్న మా స్కూల్ టీచర్లకు నా వందనములు. చాల కాలము నుండి నేను ఒకజాబు బాలమిత్రటపాకు వ్రాయవలెనని నిరీక్షించుచుంటిని. ఇప్పుడు నా కోరిక నెరవేరినందుకు దేవునికి నా వందనములు చెల్లించుచున్నాను. చదివెడు మీ కందరికి నా వందనములు.

ఇట్లు మీ ప్రియ బాలమిత్రుడు
బండారు సిలాసు,
కొండూరు

పగ కలహమును రేపును,
ప్రేమ దోషములన్నిటిని కప్పును.

C. L. S. PRESS, MADRAS—1917